# శ్రీ కృష్ణ శతకము.

గ్రంథకర్త:

పులుగుర్త వేంకటరామరావు.



ప్రకాశకులు:

శ్రీ దంతులూరి
వీరవెంకట సత్యనారాయణరాజుగారు.

# శ్రీకృష్ణశతకము.

గ్రంథకర్త:


## పులుగుర్త వేంకటరామరావు.

(కోలంక, యానాంపోష్టు.)





ప్రకాశకులు:

## శ్రీ దంతులూరి
## వీరవెంకట సత్యనారాయణరాజుగారు.



మొదటికూర్పు 500 ప్రతులు.



కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1932




[వెల రు 0—4—0.



# శ్రీకృష్ణశతకము.



మత్కోటిసరోజబాంధవమరీ।చిస్ఫారతేజో నిధీ !
భూమీభారనివారణోచితల స।త్పూర్ణావతారావధీ!
ధీమత్సంచయకీర్తితామలవిధీ! । దివ్యత్కృపాంభోనిధీ !
స్వామీ మ్రొక్కెద నేలుకొమ్మనను ని।చ్చల్ కృష్ణ ! కృష్ణ
ప్రియా॥

మ. కవితానైపుణిఁ గీర్తిఁగాంచుటకు నీ।కారుణ్య సంధానమే
భువిలోఁ గారణమందుఁ గానియెడ, మా। పోతన్న కెట్లబ్బె భా
గవతప్రోకటగద్యపద్యకలనా। కాంతాఖిలాశాంతకీ
ర్తి వధూగాఢితమోపగూహనము తం।డ్రీ! కృష్ణ! కృష్ణప్రియా!

మ. సమరక్షోణి రథంబు డిగ్గి వెనజే। జక్రంబు సారించి కో
పము రూపొందిన మాడ్కి దన్నుఁ బరిమార్ప।న్వచ్చు వివ్వచ్చు చు
ట్టము నిన్గాంచి నమస్కరించు నది భీ।ష్ముండేమొ కాకేను, నీ
దు మహత్త్వంబు నిజంబు నెట్లెరుగనే।ర్తుఁ గృష్ణ! కృష్ణప్రియా!

మ. అరయన్ ధూర్తులనిందుకొల్వనకు దౌ।త్యార్థంబు బొమ్మంటినో !
తురగానీకముఁ బూన్చి తేరుగడపన్। నోర్తుండ రమ్మంటినో !
ధరణీధ్రంబును దాల్చుమంటినో వెసన్।దావాగ్నిఁ దిన్మంటినో!
యరుదై కంటికి గానుపింప వదియే।రా ! కృష్ణ ! కృష్ణప్రియా! 4

శా. బావా యంచును బిల్చి దౌత్యమునకున్ । బంపంగ నప్పాండవుల్
రావా యంచును బిట్టుగోపమున జీ । రన్నందు నిల్లాలు ము
న్నే వైదగ్ధ్యముతోడ నే కరణి యే । యే వేల్పులం గొల్చిరో
యా వైదుష్యము నాకొకింత నిడుమ । య్యా! కృష్ణ! కృష్ణప్రియా!

మ. ధరలో నర్జునపాటనోద్భటుఁడవై । దర్పించి తన్నామ భా
స్వరునయ్యర్జును నేలినాఁడ వచు కం । సారీ నీకు జన్నే యిటుల్
నరుమాటల్ జవదాటు పాటవము లా । నా డీవు పాటింపకీ
నరు వేఁడ్కోలిపు డాలకింపమి యనం । తా! కృష్ణ! కృష్ణప్రియా! 6

మ. అలరున్ జేనియలానుఁ దుమ్మెదలు ఘాసాంకూరము ల్మేయు జిం
కలు బంగ్లుం గిసలంబులున్ దిను విహం । గ శ్రేణి బృందావనో
జ్వలసీమంబుల నాలమేపుతఱి నీ । భవ్యంపు వేణుస్వనం
బలనోకస్స్వన నేమినోమెనో సద । య్యా! కృష్ణ! కృష్ణప్రియా! 7

మ. అతివల్ నూరుబదారు వేలు నెనమం । డ్రిండ్రిందు నీకెంతొ స
మ్మతిమిం గూర్చి నిజాధరాధర సుధా । మాధుర్యమున్ గొల్పి నిన్
సతతాలింగనచుంబనాదిక మహా । సౌఖ్యాబ్ధిఁ దేల్పంగ నె
ట్టి తపం బొనరించె రాధ మును తం । డ్రీ! కృష్ణ! కృష్ణప్రియా! 8

శా. నే నానాఘౌకబంధురంబనయి గా । నీ గోవునై గాని నీ
గానంబున్ విని చొక్కుభాగ్యమునకున్ । గానంతయు న్నోమకే
నీనాఁడీక్రియ సంస్మరింతు నిను న । న్నేరీతి బాలింతువో
నానాలోకవిపన్నివారక! యనం । తా! కృష్ణ! కృష్ణప్రియా! 9

మ. మురళీనాద వినోది నీ విబుధ స । మ్మూర్ఛత్రిభంగ్యాకృతిన్
ధరబాదత్రియ యాచకంబగు భవ । త్త్రైవిక్రమ ప్రక్రియన్
వరసృష్టి స్థితినాశ హేతువు భవ । ద్భాస్వత్త్రిమూర్తిత్వమున్,
దరుగం బాపము లెంతు సంతత మనం । తా! కృష్ణ! కృష్ణప్రియా!

శా. క్షోణీధ్రాగ్రి శిలాప్రవృష్టి నిరసద్గోవర్ధనోద్ధారకా!
వీణావాణి ముఖాఖిలర్షిగణ గోష్ఠీగోప గోపాలకా!
బాణప్రాణ విభంజనా! సుజనసేవాలీఢ హృద్రంజనా!
నే నీవాడను గావు కావు మిక దండ్రీ! కృష్ణ! కృష్ణప్రియా! 11

శా. ఓ లోకేశ్వర! యో కృపాజలనిధీ! యో దీనమందార! యో
కాళీయాహిఫణాగ్రలాస్యచణ! యో కౌంతేయమిత్రంబ! యో
కాళిందీపులినావనీ విహరణోత్కంఠా! నను బ్రోవుమా
కేలుందోయిని మోడ్తు నీకు నను రక్షిన్ కృష్ణ! కృష్ణప్రియా!

మ. విలసల్లీల మృదంగతాళ మురళీ వీణాదిక స్వనముల్
సెలగన్ నీచరితంబుఁ బాడుచును; నీ చెయ్దంబుల న్వించు; ని
శ్చలతన్ గాఢ సమాధినుండి భవదంఘ్రిద్వయముం గాంచుచుం
గలుషానీకమడంపబ్రోవు నను వేడ్కన్ కృష్ణ! కృ॥ 13

మ. ధరలో వెన్నయు దావవహ్నియు; యశోదా స్తన్యమా పూతనా
శరకాంతావిష; మాంకగేహమనఘు స్తంభము కవైకుంఠ; మ
స్థిరమా ద్వారక తెల్లదీవి; యొకరీతిం దోచు నన్నావి క
ట్టి రమాధీశ్వరు నిన్ను లోఁదలతుఁ దండ్రీ! కృష్ణ! కృ॥ 14

శా. నందానందవిధాయకా! జలధి కన్యారత్న హృన్నాయకా!
బృందారణ్య విహారలోల! నిఖిలాభీరావలీపాల! గో
బృందారావని దేవరక్షణపరా! వీరక్రియా తత్పరా!
కందర్పప్రతిమాన మోహనశుభాంగా! కృష్ణ! కృ॥ 15

శా. కారాగారము లీశరీరములు రాగ వ్యాహముల్ సంకెలల్
కారాపాలురులోని శత్రువులు శిక్షాకాల మాశానుబం
ధారూఢం బగునట్టి కాలము తద వ్యక్తుండవై యిట్లు నీ
వేరా జీవులనేచె దెల్లపుడు తండ్రీ! కృష్ణ! కృ॥ 16

మ. హరువౌ నీఘటనాతి దుర్ఘటనకార్యప్రౌఢిఁ జూపింపగా
కరయన్ జైద్యున కీదలంచు సతినీవందేగి పెండ్లాడుదే ?
ధరలో దేవకికిం జనించియు యశోదాస్తన్యమున్ గ్రోలుదే ?
వరదా ! దుర్భరదావపావకదురాపా ! కృష్ణ ! కృ॥ 17

శా. తావుల్ క్రేవలజల్లి మొల్లముగ బృందన్ బంధురంబైనయ
పూప్పుం దీవలదూగుటుయ్యేలల బాల్పొల్మీరగా నూగి యా
క్రీవం గ్రేపుల మేపు చొక్కాటక పరిక్రీడార్థమై వేణువున్
బ్రావీణ్యంబున విన్చు నిన్ దలతు దేవా ! కృష్ణ ! కృ॥ 18

మ. హరి! గోవింద! ముకుంద! మాధవ! సరోజాక్షా! మురారీ! పరా
త్పర! దామోదర! వాసుదేవ! మధుదైత్యధ్వంసి ! పీతాంబరా !
కరిసంరక్షక ! కేశిశిక్షక ! జగత్కళ్యాణ సంధాయకా !
నరహార్యక్ష ! పరంతపా ! పర ! యనంతా ! కృష్ణ ! కృ॥ 19

శా. పాలుం ద్రావుచుఁ బూతనాసువృషదశ్వవ్రాతముం గ్రోలి; నిన్
లీలన్ ఱోలను తల్లికట్టు నెడదోల్తలన్ వెసన్మద్దులన్
నేలన్ గూలిచి యల్లవల్లవజనానీకాక్షి పర్వార్థమె
న్నేలీలల్పచరించు నిం దలతుఁ దండ్రీ ! కృష్ణ ! కృ॥ 20

శా. ఓ లక్ష్మీరమణీశిరోమణి హృదబ్జోల్లాసభానూదయా !
యో లోకప్రకరావనా వికల ధైర్యోత్సాహధౌరేయకా !
యోలీలాపహృతాఖిలావనిభరా ! యో బాలగోపాల ! యో
ప్రాలేయాచలజామనోరమణమిత్రా ! కృష్ణ ! కృ॥ 21

శా. పౌగండంబునఁ గొండదాలిచి శిలావర్షంపు గండంబు గో
పీ గోపాలక గోకదంబమున కీవిశ్వంభరామండలిన్
వీగం జేసితివన్న నెన్నడి నిజం బేమైన నన్నేలవే
ధా ! గోవింద ! ముకుంద ! తోషిత సనందా ! కృష్ణ ! కృ॥ 22

శా. కృష్ణామానదనాభిరక్షణచణా। కృష్ణాంగరోచిస్స్ఫుటా
జిష్ణుగ్రావక వర్షసంచయహరా! జిష్ణు ద్విషోన్మూలకా!
వృష్ణిప్రాకట వంశపద్మతరణీ! వృష్టిప్రభవత్ సత్కృపా!
తృష్ణాతంతు నిబద్ధబుద్ధి పరిపం।థీ కృష్ణ! కృ॥ 23

మ. యమరాజద్విపులాన్వయాగ్రణి! విపన్నానీకరక్షామణీ!
మదవద్దైత్యచయాంధకార తరణీ! మహామోహాకృన్నైపుణీ!
కుధరోద్ధారచణాగ్రణీ! గుణమణీ!। గోపాలచూడామణీ!
పదకంజాతయుగానతామరకదం।బా! కృష్ణ! కృ॥ 24

మ. అటుకుల్ గుప్పెడు సిగ్గుతోడ నిజచే।లాగ్రంబునం గట్టుకొం
చెటులో వచ్చు కుచేలు దూరభువిలో। నీక్షించి తోడ్తెచ్చి నీ
పటుగాంగేయ మయాసనం బిడి వెసన్। బాలించు భక్తావనో
ద్భట! నన్నేలుము నీకు మ్రొక్కెద సనా।తా! కృష్ణ! కృ॥ 25

శా. నీ కేల్దమ్మి నిరంతరమ్ము సుజనా। నీ కాభయోదారమౌ;
నీ కన్నుంగవ తమ్మికల్వవిరులన్। నిర్నిద్రము ల్సేయు నీ
యాకారంబసురాంధకారమున క।త్యంతంబు వెన్నెల్గహా
నీకున్ సాటియె లాతివేలుపులు దం।డ్రీ! కృష్ణ! కృ॥ 26

శా. కాంతారాంతర కుంజపుంజములలో। గాసారతీరంబులన్
బంతుల్దీరినసానుమంతములపై। పైకందరాంతంబులన్
బంతాలాడుచు చల్దులం గుడుచుచుం। బల్మారు గోపాల క
స్వాంతంబుల్వలయించు నిం దలతు నీ।శా! కృష్ణ! కృ॥ 27

మ. అరిమధ్యంబున దేరి రథ్యముల క। త్యంతంబు నీర్వెట్టగా
నురుశక్తిన్ దొరలెల్ల సూడ నరుచే। నొప్పారగాసారమున్
శరముల్ మాటిడి త్రవ్వజేసిన భవ। చ్చాతుర్యమార్యామనో
హరుడైనం దెలియంగ నేరడుగద। య్యా కృష్ణ! కృష్ణప్రియా! 28

శా. కారుణ్యామృత వృష్టులంగురియుచున్ । కంజాతయుగ్మంబుతో
రారాజత్పద కింకిణీరవముతో । రాకేందు వక్త్రంబుతో
స్మేరాంకూరవివర్ధమానరుచితో । జెల్వొంద వేవేగ రా
వేరా? దీనుని నన్నుఁబ్రోవఁగమురారీ! । కృష్ణ! కృష్ణప్రియా! 29

*మ. చిగురుంగైదువుజోదుగాంచినరమా । సీమంతినీరత్నముల్
దగనిల్లాలుగ సేవకవ్రజము — । దైత్యద్విషౌఘంబు, ము
జ్జగముల్ బొజ్జనిముచ్చుకొంచతుల ర । తూపౌత్రి దీపింతు వె
న్నగ నీసామర్థ్య మనంతమాగద యనం । తా! కృష్ణ! కృష్ణప్రియా

మ. కరిరాజేంద్రునిగాచినాడవఁట చ । క్రంబైనఁ గైకోక యుం
బరమక్షయ్యముగాఁగనిచ్చి తఁట యా । పాంచాలికిన్ జాలి ను
ర్వరలో నంతికమందు నిల్వకయునీ । భక్తావనంబెల్ల నె
ల్లరకున్ దెల్లమ నన్ను బ్రోవవిఁక మే । లా! కృష్ణ! కృష్ణప్రియా! 32

శా. బృందారణ్యమునందు వల్లవసతీ । బృందంబు డెందంబునం
గందర్పున్ లలిఁగన్నతండ్రివగు నిన్ । గామించి లోమించుబల్
కందర్పాగ్ని శిఖాకలాపములఁ గ్రా । గన్ రాసకేళీకళా
సందర్భంబున నేలు నిందలతు నీ । శా! కృష్ణ! కృష్ణప్రియా! 33

శా. అంభోరాశి శయాన! యెల్లయెడలం । దావిర్భవించీవు సం
రంభప్రక్రియ నిండియుండుటకుఁ దా । ర్కాణంబుగా నెంతు ని
న్నంభోగర్భమునన్ శ్వఫల్కజుడు ప్ర । హ్లాదుండు కంబంబునన్
దంభంబొప్పఁగఁగాంచినారన నసం । తా! కృష్ణ! కృష్ణప్రియా! 34

---

*మ. చిగురుంగైదువు జోదుకన్నకొడుకా । శ్రీకాంత యిల్లాలు; ము
జ్జగముల్ పాలనసేయుతావులలత్రిం । శతకోటి బృందారకుల్
నగవుల్ గుల్కెడుకన్నసన్నఁబను లె । ల్లంజేతు రెల్లప్పుడే
న్నగనీభూతియనంతమాగదయనం । తా! కృ॥

మ. నవనీతోనములైన మానుల మన । స్సీమంబులందొంగిలన్
నవనీతంబుహరించి పర్వతము వి । న్నాణంబునన్ దాల్చి ప
ల్లవకాంతాకుచపర్వతంబులను దా । ల్చన్నేర్చు నీనేర్పు నం
స్తవమున్ జేతు నఘంబడంగ జగదీ । శా! కృష్ణ! కృష్ణప్రియా. 35

శా. క్రూరుండయ్యెను నిన్ను వెంటగొని య । క్రూరుండు దానెంత యు
క్రూరుండయ్యెను గోపకాంతలకు గ । న్గోకున్కి నిన్నన్న ని
న్నారాధించినవారికెప్డుఁ గృపఁ బ్ర । త్యక్షంబుగాకున్నచో
భారంబైకను పట్టదే తనువు దే । వా! కృష్ణ! కృష్ణప్రియా! 36

మ. దవకీలిం గబళింపమించిన భవ । తాపంబు శాంతింప గో
పవధూచందనసంయుత స్తన పరి । ష్వంగంబు లక్షించి త
న్నవ బింబోష్ఠ సుధాసుధారలను పీ । న్నాణంబునంగ్రోలెదో?
యవికారంబున నెంతయేమియు ననం । తా! కృ॥ 37

మ. నగభిన్ముఖ్య దిశాధినాథులు మహా । నందంబు దండంబులన్
దగఁ గోటీరచిరత్నరత్నరుచి సం । తానంబు నీరాజనం
బుగ నర్పించుచుఁ గాని తాముబొగడం । బోనేర్తురే సుంతయున్
నిగమంబుల్ వొగడంగ లేని నిను తం । డ్రీ కృ॥ 38

మ. తమశీర్షంబుల ద్రాచుబాములుభవ । త్పాదాంకమున్ దాల్చుఁధ
న్యము నీనామముబల్కు గృధ్రములు కృ । ష్ణాయంచు నెల్లప్పుడున్
రమణీయంబుగ నిన్నుగొల్చుటకు ది । ర్యగ్జంతుజాలంబు నై
తమ మాకెంతయు నీతిబోధకమనం । తా! కృ॥ 39

శా. వాలింజంపినయట్టి పాపమునకై । వధ్యుండవైతీవటం
చాలోచించుట పాడిగాదగదు జ । న్మాంతంబులంబోనిసీ
కేలామృత్యుముఖంబునం బడగనెం । తే గర్మబద్ధంబు సు
వ్యామ్నాలోకంబని తెల్పఁగాకరయ దం । డ్రీ! కృ॥ 40

మ. ధరణీజాప్రియభావమూనుట జగ । త్ప్రాణాత్మజప్రేమమున్
సరసీజాప్తతనూజశక్రజులఁ జం । చల్లీలఁబోరించుటన్
ధరణీభార నివారణార్థముగ మ । ర్త్యత్వంబుఁ గైకొంట దా
శరథిప్రౌఢిమమంచునేఁ దలఁతు నీ । శా! కృ॥ 41

శా. గంధర్వాకృతిఁ బూనెమద్దులిలనీ । కాలూఁకి కేలూఁకినన్
గంధేభంబున కార్తివోయె! మెయి సో । కం గుబ్జమువ్వంక వో
గంధర్వాంగనకన్న మిన్నయగుచుం । గన్పట్టెడెందాననిన్
సంధింపన్ భవబంధముల్ తెగవె యీ । శా! కృ॥ 42

శా. గాంధారేయులు విశ్వరూపుని నినున్ । గన్నారగాఁగాంచి గ
ర్వాంధప్రక్రియపీడరః బికసుతుం । డత్యంతమున్ గాంచె ని
న్నంధుండయ్యునుఁ బూర్వజన్మకృత । పుణ్యంబెట్టిదే కా! దయా
సింధూ! కౌస్తుభరత్నదీధితివిభా । సీ! కృ॥ 43

శా. లీలామానుష విగ్రహుండవయి బా । ల్యంగేళిగోపాల బా
లాళింబ్రోచియు రాసకేళిసల గో । పాఙ్గాయుతాసక్తితన్
హేలన్ బాలన సేయు నిన్ను మదిలో । నే నెంతు నశ్రాంతమున్
జాలంబించుకలేక నేలు జగదీ । శా! కృ॥ 44

శా. చుట్టుంగైదువుదాల్చి చెట్లలగు ర । క్షోనాథులం గొట్టి వే
జట్టుల్ జీల్చెడు దిట్టవంచు దమిన । శ్రాంతంబు జేజేలు నిం
బట్టుంగొమ్మనఁగ బూని కొల్తురన నె । వ్వండేపుమై నీదుచే
పట్టున్వీడి మనంగలాఁడవని దే । వా! కృ॥ 45

శా. సారంబింతయు లేనిదయ్యు నిల నీ । సంసారమే లోతగుం
బారావారముకంటె, గాధిజుడుము । న్వాసిష్ఠులం దుంచినన్
నీరై నిల్వన నవ్వసిష్ఠుడపు డెం । తే డిగ్గమోకాలి బం
టైరత్నాకరమొప్పుటన్ జగదధీ । శా! కృ॥ 46

శా. జ్ఞానోదంచిత సాధయూథవిలస।త్సంచారియై యెవ్వడే
ధ్యానాకర్ణన కీర్తనార్చనల నీ । యందే తలంపుంచు న
వ్వానిన్ శాశ్వతమోక్షలక్ష్మికను కం।పం బట్టముం గట్టదో
మానీంద్రావళిగణ్యపుణ్యగుణధా । మా! కృ॥ 47

మ. అరయన్ జిష్ణుముఖాఖిలామరశిరో । దంచత్కిరీటాగ్రభా
స్వరనానావిధ రత్నసంచయ విభా । సంశోభినీ పాదనీ
రరుహద్వంద్వము కల్మషాపహము ని।ర్వాణప్రదంబంచు నే
నరుసంబందిభజింతు బాపుభవ మీ । శా! కృ॥ 48

మ. అవతంసంబవు యాదవాన్వయమునం । దంభోజపత్రేక్షణా
నవమీనాంకుడ విందిరాలలనకు । న్నాథుండ వంభోజసం
భవశంభుప్రముఖాఖిలాసురరిపు । వ్రాతైకసేవ్యుండ వీ
భవదుఃఖంబు హరించుప్రోడవుగ ద । ప్పా! కృ॥ 49

మ. అవతంసంబవు సర్వదేవతలకై । యత్యంతమీవొప్ప నీ
కవతంసంబగు బర్హిపింఛమది; యా । హాదానిదే భాగ్యమే
భవముం బెట్టి తపంబుసల్పెనో? భవ।త్పాదాంబుజద్వంద్వ మె
ట్టివిధింగొల్చెనో? యెవ్వడేమెరుగు దం।డ్రీ! కృ॥ 50

శా. దారాత్మప్రభవోదరంబులకునై । తారింతలింతల్ పనుల్
క్రూరత్వంబున సేయనేమిటికి? క।న్గొనెవ్వడెందైన నా
హారార్థంబుగ ప్రాణముల్విడిచెనే । యత్యంత మీసృష్టిలో
నారుంబోసియు నీరుపోయనె? యనం । తా! కృ॥ 51

మ. చెలిమిన్ జేయ, ననుంగుజుట్టరికమున్ । జేయన్, సదామోవితే
నెలుజుర్రింపను, వైరముంగొననహో । నిర్మోహినై కొల్వఁ, జ
ట్టులుబెట్టన్, పృథుకంబులైననిడ నే । లుబ్ధుండ నెబ్భంగి నా
కెలమిన్ మోక్షపదంబు లభ్యమగు దం । డ్రీ! కృ॥ 52

మ. తమిఁజోటుం బెనుదాఁటఁగట్టితివొ? కం।తంబూనిదోర్వ్యాపారి జా
తము దెచ్చుంటివొ భూమికిన్? తతగుహాం।తర్భాగమందాజి స
ల్పితివో నిన్నెరుగంగ లేక? వడి బ।ర్వెత్తంగ వెన్నంటి త
జ్జితివో? పాలనసేయవేమి ననుదం।డ్రీ! కృ॥ 53

మ. మఱదిం బట్టి, యెలుంగుతో దొడరి, స।న్మాణిక్యమర్థించి, వ
న్యరతిం బోయి, ప్రతాపముం బఱపి పే।రాబోతులం గట్టి, మా
ఱ్ఱురకుంభీతిడి, మత్స్యయంత్రమును దో।ర్త్తో నేసి, నీవష్ట సుం
దరులం బెండిలియాడు టెంచెద ననం।తా? కృ॥ 54

మ. నరకాందోళిత బంధనాలయవస।న్నాళీకపత్రేక్షణో
త్కరబంధప్రవిమోచనంబిడిన చం।దంబెంచు నాకీవె దు
ర్భరదుర్ధ్వాంతతమోనిశాంతతనుకా।రాబద్ధ సంసారబం
ధురబంధప్రవిమోచనంబు మునిబంధూ। కృష్ణ ! కృష్ణప్రియా.55

మ. పరగన్ నాగసరోజనేత్ర యరుదో ?। పాతాళగంగోదకం
బరుదో ? మానిజనాతిదుర్గభసురా।ధ్యక్షోర్ధ్వసింహాసనం
బరుదో ? హైమవతీశుగెల్చుటరుదో ?। యగ్నిప్రియాపాదిపూ
టరుదో ? నీకృపగల్గుచో నరునకీ।శా ! కృష్ణకృష్ణప్రియా ! 56

శా. కాంతాద్రోహముదల్చుబోయనయినన్।గాండీవముం దాల్చియున్
సుంస్థైన న్వాఱపింపజాలడు రణ।స్థగ్నోరిపుత్స్నాప సం
ఘాంతాపాదనదక్షుడైన విజయుం।డైనన్ భవత్సత్కృపా
క్రాంతుండై యలరారకున్న నరుడా।రా ! కృష్ణ ! కృష్ణప్రియా !

మ. ఇలపై బుట్టువెరుంగకుండియును నీ।వీవిశ్వవిశ్వస్థజీ
వులసంఘంబులనెల్ల దల్లిపగిదిం।బ్రోవన్ సదాతల్లి పి
ల్లలఁబోషించువిధంబు నేర్చుకొనులీ।లం బోలుఁగాంతామత
ల్లులగర్భంబులయందుఁబుట్టుటదయా।ఘా! కృష్ణ ! కృష్ణప్రియా!

మ. జడభావంబడి మెంతగల్గిన భవ । త్సాన్నిధ్యముం డీ నీ
యడుగుం బాయని వారిం బూను దలన । త్యంతంబు మా కాంతుడ
ట్టిడు భూభృత్కులమౌళియట్టిడన నె । ట్టిం డైనం జేకొనసమ
ర్థుడ ! నీ దైనమహత్త్వమార్యజనబం । ధూ ! కృష్ణ ! కృష్ణప్రియా !

మ. ఉమరాణ్మౌళిశిరంబుపై విడియ కా । యుర్వీధరాధీశు పై
నడరం జాలక పుణ్యభూమితలమం । దా గంగ లేకా సము
ద్రము జేపట్టిన నిల్వకందుభయ వా । ధోలోకముం జేరనీ
యడుగుం బాసిన వారి పాట్టివియ దే । వా ! కృష్ణ ! కృష్ణప్రియా 60

శా. క్షీరాంభోధియనుంగుగూంతునకు ర । క్తిన్ జెక్కిలి గీటి మా
మీరాజీవముఖీకుచాగ్రముల జే । ర్చిం బత్రముల్చెక్కి నీ
లారామామణి కెల్లయిక్కువలు హే । లన్ముట్టికీడించు నీ
దారామోదదలీల లెంచెద ననం । తా ! కృష్ణ ! కృష్ణప్రియా ! 61

మ. పురుహూతప్రముఖాఖిలామరశిరో । భూషామణిశ్రేణిపై
పరమస్నిగ్ధహృదంబుజాళిపయి మా । భామోరుపీఠంబుపై
బరగంగా శ్రుతిసుందరీసుకబరీ । భాగంబుపైం బొల్చు నీ
వరపాదద్వయి గొల్తు బాపముడిదే । వా ! కృష్ణ ! కృష్ణప్రియా ! 62

మ. తులువల్ వల్వలుకొల్వులో నొలువగా । దుఃఖించు నా ద్రౌపదీ
లలనారత్నము సంభ్రమంబు దెలియన్ । లక్ష్యంబుగా నెంతు నీ
జలకేళీవిలసద్వధూనివహవ । స్త్రశ్రేణిచౌర్యంబు ని
చ్చలు నే భూతభవిష్యదర్థవిదభి । జ్ఞా ! కృష్ణ ! కృష్ణప్రియా ! 63

మ. పరగన్ మామగృహంబునందు నఘను । ద్భృంగంబుగా బెంచుటల్
వరసాలంబుల నేలగూల్చుటను దే । వద్వేషణౌఘంబు సో
దరుతో గూడి హరించి మించుటను త్వ । త్కార్యంబులూహించి దా
శరధి ప్రాభవముంచు లోదలతు నీ । శా ! కృష్ణ ! కృష్ణప్రియా, 64

మ. హాలహా రంగదభంగభంగకలశాం।భో రాశి తెల్పందులో
వలదల్పీకృత శేషుఁ డందెలుపు త్వ।త్పాదాంబుజాతాంబువుల్
దెలుపీవుండినయాంతరీపముగదుం। దెల్పయ్యునల్పీవు భ
క్తులలోనల్పుహరించు హేతువులనో। కో! కృష్ణ! కృష్ణప్రియా.

శా. రాసక్రీడలగోపకామినులు సం।గ్రామైకరంగంబునన్
గాసింజెందుకిరీటిగుర్ముములు రం।గత్కేళిపార్థుండును
న్నే సేవల్పచరించుటన్గనిరొ యెం। తేనీకరస్పర్శమున్
వాసిందెల్పిమదర్పితార్చగొనుమ। ప్పా కృష్ణ ! కృష్ణప్రియా ! 66

మ. ననుబుట్టింపగనేలనేలపయినం। తంబోక యీబాల్య యూ
వనవార్ధక్యము తేటికందున మనో। వాక్కాయకర్మంబులం
దునవొందైననునీకుగూర్పనిమహా। దోషంబుగల్పించి వే
ననుదండింపగ నేలపిమ్మటయనం। తా ! కృష్ణ ! కృష్ణప్రియా

మ. వెసదారాత్మజమిత్రపిచినిచయా। భీంగాస్మదీయప్రమో
హాసముద్రంబున జ్ఞానసేతువ్రుసు బెం।పారంగ నిర్మించిరా
తుసరాట్కా్రరతరాంతరంగరిపులం।జక్కాడు మా తెల్పుదిం
పెసలారంగనువారిమర్మములు తం।డ్రీ! కృష్ణ! కృష్ణప్రియా ! 68

మ. జనకాదుల్ సనకాదులున్ భవదుదం। చత్పాదనీరేజసే
వనభాగ్యానుభవాఢ్యులై నిరతమున్।భక్తాగ్రగణ్యైక కీ
ర్తనరున్ భాజనులై రటన్ననిక నీ।రాజత్పదాంభోజపూ
జన మేయోజనిరాకరించు జను డీ।శా! కృష్ణ ! కృష్ణప్రియా! 69

శా. భావాతీతుడవంచుబండితులునిన్। భాషాళిలోబల్కనా
భావంబందున నిన్నునిల్పుకొనినే। భావించుటెట్లంచునో
భావజ్ఞామదిదోచె? నీదయినరూ। పంబెట్టిదో చూపగా
రావేరాకృపచేత జేతమొసలా। రన్ గృష్ణ ! కృష్ణప్రియా ! 70

మ. త్రిజగద్రక్షణదక్షదక్షిణభుజా! శ్రీ జన్మదిక్కుంబు డాల్
త్రిజగన్మోహనమైనసర్వగగదారి శ్రీవిభాస్వత్కరాం
బుజముల్ వేణుపు వేణునాదకలనం బొల్పారగోపవ్రజ
వ్రజముంగా పానరించు నిందలకు దేవా! కృష్ణ! కృష్ణప్రియా!

మ. కలలందోచినవస్తులూషరధరం గన్పట్టు బేరెండమా
వులు, మాయామగ నైంద్రజాలికుని కై బొల్పొందుచిత్రార్థముల్
జలబుద్బుదములు ధూమఖండములు చంచద్వారిదనీకాంతు లి
య్యిలమాకేలధనార్థిసౌఖ్యములు తథ్యంబే! కృష్ణ! కృష్ణప్రియా!

మ. గిరిరాజోద్ధరణాకరంబు త్రిజగత్క్షేమంకరంబైన నీ
కరమందాదరమొప్పదాల్చెదవు పంకంబాదునంబుట్టు నా
దరముల్ బుట్టినచోటుగాక బహిరంతస్సిద్ధభావంబె మా
కరయన్ ముఖ్యమటంచు దెల్పగ ననంతా! కృష్ణ! కృష్ణప్రియా!

మ. అరయన్ ధాత్రిపిపీలికాది విధిపర్యంతంబు జీవాళిపై
కరుణాలోకనమింతొ యంతొ పరగంగా జేతువే వెన్నుడం
దురులోకానుభవస్థలస్థయుతచో దూబూమమైనన్నిటన్
బరి వేధించునె జన్మకర్మములు దేవా! కృష్ణ! కృష్ణప్రియా! 74

మ. ఉదరోరోభుజఫాలసీమలమనోజ్ఞోర్ధ్వపుండ్రంబులం
బదియార్వన్నె పసిండిపుట్టముకటిన్ పద్మాలయాస్థానమౌ
యెద శ్రీవత్సము కౌస్తుభంబును తనర్తే దమ్మిపూబోలు బెం
పౌదవన్నిల్వము, మౌళి మొక్కెదదయా! నా! కృష్ణ! కృష్ణప్రియా!

మ. ధరపై నష్టనమైత్రి, నష్టనములన్ వైహారగంధర్వులై
పరగం జేసియు నాకళిందతనయా పాథోవిహారాద్భుతిన్
గరమొప్పారితదాపగాఖ్యదగుటన్ కాళిందిజేపట్టియున్
నరనామున్ననునేలకున్కవగదన్నా! కృష్ణ! కృష్ణప్రియా! 76

శా. కాళిందీధునితుంగభంగచయసంగత్సైకతంబందునన్
కాళీయోరగమౌళిమౌళిపయినాకాళింది యూరుద్వయిన్
బాళింబొల్చుభవత్పదాబ్జయుగళిన్ భావింతుమద్ఘోరపా
పాళింబాపగనందనందన! ముకుందా! కృష్ణ! కృష్ణప్రియా! 77

మ. గ్రహసంఘంబుపరస్పరభ్రమణ సంఘర్షంబు లేకుండగా
రహియించుం జదలందు సూత్రఘుటికావ్రాతంబు చందాన ని
మ్నహితాంభోధులు వేల దాటిచన వేమాత్రంబు నెవ్వానియా
జ్ఞహసాదంచనియట్టినిందలతు నీశా! కృష్ణ! కృష్ణప్రియా! 78

మ. భవపద్మోద్భవవాసవాదికసుపర్వవ్రాతమెవ్వానిసం
స్తవముం జేసితదంఘ్రిధూళిదలమిం చందాల్చు, నెవ్వానిమా
ర్తివిశేషంబుమనీషిసంఘముభవార్తిం బాపుకోజిత్తమం
దువెసన్నిల్పెఘనట్టినిన్నునుతియింతున్ కృష్ణ! కృష్ణప్రియా! 79

మ. విషముంగ్రోలవొ? యెగ్గుగూల్పవొ? జగద్విఖ్యాతదేవాపగా
విషముందాల్పవొ? పామునేలవొ? సురద్వేషావళిందుంపవో
విషమాలోలురబ్రోవరావొ? శరధింబేరంపలన్ముంపవో?
విషమాస్త్రారికి నీకు భేదమెది యున్నన్ కృష్ణ! కృష్ణప్రియా!

మ. సుతుఁడంచల్లయశోద స్నేహితుఁడటంచుం బాండుపుత్రౌఘమున్
బతియంచాపదియారునేలపడతుల్ బంధుండటంచుం జెంతొ న
మ్మతిభోజాంధకవృష్ణివంశ్యులెవనిన్ మన్నింతురశ్రాంతమా
నతకైవల్యదునిన్నుఁగొల్చెదననంతా! కృష్ణ! కృష్ణప్రియా!

మ. సకలాజాండవిభాకరాబ్జరిపునక్షత్రౌఘతేజోవిధా
యకమైనసర్వాతిమోహనంబగు త్వదీయామేయరూపంబుముం
దొకదీపంబిడసంతసింతువట యో జ్యోతిస్స్వరూపుండ! యే
రికినాత్మానుగుణంబె భావ్యమగుదం శ్రీ! కృష్ణ! కృష్ణప్రియా!

మ. విషమున్ మ్రింగినమన్మథారి త్రిజగద్విఖ్యాతమిత్రుండు బల్
విషముల్ గక్కుభుజంగభర్త విపులాభీలంపుభోగంబు బెన్
విషధింబాన్పగు నీయెడన్ విఫలమై పెంపేమటల్ జిత్రిమే
విషలిప్తస్తనదుగ్ధమంచితగుణా భీ! కృష్ణ! కృష్ణప్రియా! 83

మ. జలకేళింబచరించుపల్లవసరోజాతాయతాక్షీమత
ల్లులపుట్టంబులు దొంగిలించుటలు బోలు స్మరుదేహాభిమా
నులుగానుండిన యంతకాలమును నన్నుం జేర కేరంచు భ
క్తులకుం దెల్పెడిలీలమానిజనబం ధూ! కృ॥ 84

మ. విజయాభీలశరాగ్నికీలల రణ ద్విద్విట్ఘోరాహిత
వ్రజశుష్కాటవిగాల్చి యింకను ఘరా భరంబుబోపెను బం
ధుజనౌఘంబు బరస్పరప్రకటశత్రుత్వంబుచేద్రుంచవే
త్రిజనాటకసూత్రధారి! యసురా రి! కృ॥ 85

మ. వ్రిజసంతానము మేతమాని నెమరుల్వంచి యచ్చట్ల నీ
త్రిజగన్మోహన దివ్యమంగళతను శ్రీగాంచి యుదాన జో
క్కి జడంబయ్యెను మోద బాష్పములు పేర్వాన్నాగగోపాంగనా
వ్రజమేపాటిది చొక్కడే హరుడు దే వా! కృ॥ 86

మ. మురళీగానమరందబిందులహరీ మోదానుసంధాయినీ
మురుపున్ గన్నులపండు వట్లుకసియా ముగ్ధవ్రిజస్త్రీలు మై
మఱపుల్వాటిల లోగరంగి గుములై మారాగ్నులంగాగ వా
రిరహింబోవ వె? యార్తరక్షణ! మురా రీ! కృ॥ 87

మ. కమలోరుద్వయిభాసురంబు, త్రిజ త్కల్యాణ సంధాయకం,
బమరేంద్రాది దిగీశరత్నమకుటా గ్రాంచ త్ప్రభాశోభితం
బమలజ్ఞాన విరాజితాపన్నకిదం బానందకందంబు, నీ
పదలాంఘ్రిద్వయమే భజింతుసతము దేవా కృ॥ 88

మ. తళుకుంజెక్కులు కుండలప్రభలచే । దగ సొంపువాటిల్ల గే
కిలసత్పింఛము మౌళిభాగమున ర । క్తింగాంతులీనంగ గ
జ్జెలుపాదద్వయి ఘల్లుఘల్లనదర । స్మేరంబు నెమ్మోముపై
దొలుకాడన్మనమందు నిల్వుము భజిం । తున్ కృ॥ 89

మ. స్ఫురదద్రీశ్వరకన్యకాధవజటా । జూటాగ్రదేవాపగా
శరచంద్రప్రసరత్సుధారసములన్ । శైత్యంబునన్నించు నీ
కరుణాంభోనిధితుంగభంగచయ మం । గద్బిందు వాక్కొండు చా
లురనాపై బఱగింపు మొక్కెద దయా । బ్ధీ! కృ॥ 90

మ. ఘననీలాంబుదకాంతివైభవముతో । గంధేభయానంబుతో
కనకోదంచితకుండలద్వయముతో । కంజాతదామంబుతో
రణదుద్యన్మణికింకిణీరవముతో । రాకేందువక్త్రంబుతో
ననునేలంజనుదెంచవేమిర యనం । తా! కృ॥ 91

మ. జలజాతాంకుశశంఖచాపకులిశ । చ్ఛత్రాసిసీరాంకితో
జ్జ్వలమై పల్లవకోమలంబయిన నీ । పాదద్వయిన్ కట్టి ? చం
చలముంగర్కశము న్మలీమసము న । స్మచ్చిత్తమున్ జొచ్చి యో
నిలుపంబోయిట యెంతమొక్కినను దం । డ్రీ! కృ॥ 92

మ. అరయంగా వసుదేవదేవకుల పు । ణ్యశ్రీనిధానంబు శ్రీ
తరుణీరత్నము నోముపంట సరుహా । స్త్ర స్య స్తైవంబు, భా
స్వరయోగీంద్రకదంబకంబు నిధి గో । పస్త్రీల సౌభాగ్యమౌటని
న్నరణంటి న్ననుబ్రోవుమింక జగదీ । శా! కృ॥

మ. పలుకుంగెంజిగురాకుబోడిమగ డా । బల్గట్టరాయల్లు వా 93
డలపాపిమిన్నుపడంతి వేల్పుగమలా । వంతేని భాషావళిం
బలుకంజాలనియట్టి నిన్బొగడుటం । బాటించు నాజిహ్వకాం
చలచాపల్యమదెట్టిదో యెఱుగ ? నీ । శా! కృ॥ 94

మ. చెవియందుంచినకర్ణికారము భుజ । శ్రీబెంపు రెట్టింప పిం
ఛవిభూషాంచిత మౌళియొక్కదిశకుం । జానొందగంజాయమో
వివిజృంభించెడు బిల్లగ్రోవిరవళిన్ । విన్పింపనవ్యత్వ స్తవహా
భవదంఘ్రిద్వయికిన్ నమస్కృతులు దే । వా ! కృ॥ 95

మ. నినుమున్నిర్తనసేయనో రసన? నిన్వ । క్షింపనోకన్నులన్?
నినుసేవింపనొకో కరద్వయిని? న । న్వేషింపనో నిన్ హృదిన్?
వినవో నీకథవీనుదోయి ? మరియొ । న్నేనల్పితోఁ గానియీ ?
జనిదుఃఖంపక బాపుచాలు జగదీ । శా ! కృ॥ 96

మ. హరినీలంబులడాలు డీలుపడ జే । యం జాలునీమేని నీ
లరుచంగాలఘనంబుడంబనుచు లీ । లా లోలకేకావళి
స్ఫురణం గేకులు వీక నాట్యకలనన్ । సంసారవేణుధ్వనుల్
వరగజాకృతి విన్చునీకు నతిదే । వా ! కృ॥ 97

మ. తొలియేనోములనోమియొట్టిసుజన । స్తోమంబుబూజించియే
విలసత్ క్షేత్రముజూచియెట్టిగహనో । ర్వీం బట్టపంబాది కే
రెలమింబున్నెములెన్నిసల్పి మరియే । మేమో గావింపగా
వలెనో సిగ్గనుభాగ్యమబ్బుటకు దే । వా ! కృ॥ 98

మ. నతినీచల్లనికన్నుదమ్ములకు నీ । నాళీకదామంబుకున్
నతినీకౌస్తుభరత్న దీధితికి నీ । నవ్యాయుధశ్రేణికిన్
నతినీపింఛకకాంతకాంతులకు నీ । నర్మానులాపాళికిన్
నతినీపాదసరోరుహద్వయి కనం । తా ! కృ॥ 99

మ. జలసంచారవిసారభావజలభూ । సంచారకూర్మత్వకే
వలభూచారవరాహకత్వహరిస । ద్వక్త్రాత్రిఘ్నము ర్త్యత్వకు
జ్జ్వలనమ్రాకృతికుఠారధారి వరచా । ప భ్రాజిసత్సీరధీ
బలికల్కికృముపద్ధులందలతు దే । వా ! కృ॥ 100